Approved for school Reading Ft. St. Gt. 142 Dated 30-4-40.

194

# CHILDREN'S POETRY-READERS

# బాలగీతావళి.

**NURSERY RHYMS.**

నాలుగవ తరగతి.



## వేంకట పార్వతీశ్వరకవులు

6th

A. P. G. NILAYAM, COCANADA.

# బాలగీతావళి 194

## (నాలుగవ తరగతి.)

వేంకటపార్వతీశ్వరకవులు.





ప్రకాశకులు:
ఆంధ్రప్రచారిణీ గ్రంథనిలయము,
కాకినాడ.
1940.

 [వెల రు 0—2—6.

# పీఠిక.

---

పాఠపుస్తకము:— పాఠశాలలయందలి పిల్లలకు వారి వారి వయఃక్రమమును, (From stage to stage) బుద్ధిశక్తుల ననుసరించి వ్రాయఁబడిన పాఠపుస్తకములే యావశ్యకములై యున్నవి. అవి చిన్నబిడ్డలకు గృహపరిసరములం గలిగిన యనుభవజ్ఞానమును బరిస్ఫుటముగ వికసింపఁజేయుటకు సహాయభూతములై యుండవలయును; వారికిఁ దెలిసినవిషయముల ననుసరించియే తెలియనివిషయములను బోధించుచుండవలయును. అందలి పాఠములు బిడ్డల కుత్సాహమును, వాసక్తిని, జ్ఞానమును నభివృద్ధి పఱచునవిగా నుండవలయును. ప్రకృతివిరుద్ధములగు విషయములనుగాని, (Unnatural-subjects) యూహల కందనిభావములనుగాని వారికి బలవంతముగ బోధింపఁగూడదు. భావమే కాక భాషకూడ వారికి సులభగ్రాహ్యముగను; సులభవాచ్యముగను నుండవలయును. పాలుత్రాగు పసిబిడ్డలకు భిన్నరుచులుగల యాహారపదార్థములను సేవించుపద్ధతి క్రమక్రమముగ నలవాటు చేయునట్లే భిన్నవిషయములను, భిన్నభావములను యథోచితముగ (Careful grading) బోధించుచు బిడ్డల జ్ఞానలేశమునకు సక్రమవికాసమును గలిగింపవలయును.

వచనపాఠములు—పద్యపాఠములు:—బిడ్డలకువిషయ పరిజ్ఞానమును (Subject kowledge) గల్పించుటకును భావవికసనమున (Development of thought) కూర్చుటకును మేధాశక్తిని (memory) బలపఱచుటకును ఉత్సాహమును వర్ధిలఁజేయుటకును వచనములకంటె పద్యములే శ్రేష్ఠములని యనుభవమునుబట్టి యందఱు అంగీకరింపవలసినదే. కాని, యిప్పటిపాఠపుస్తకములను దిలకింపఁగా నందలి వచనపాఠములతోఁ (prose lessons) బద్యపాఠములుకూడ (poetry lessons) జేర్పఁబడియున్నవి. ఆరెంటికిని భాషాసంబంధముగాని, భావసంబంధముగాని, యెంతమాత్రమును లేదు. ఆ మాట నిజమే—ఏమనిన—ఆపద్యపాఠములు వచనపాఠములవలె బిడ్డలయుపయోగముకొఱకు వ్రాయబడినవై యుండలేదు. పాఠపుస్తకములను వ్రాయువారీవిషయమును బొత్తుగ నూహించుటయే లేదు. వారూహించునది బిడ్డల బుద్ధివికాసమునకు ముఖ్యముగఁ బద్యపాఠము లుండవలయుననిమాత్రమే—కాని, విషయపరిజ్ఞానముతోఁ బాటు బిడ్డలభావములను మేధాశక్తిని వికసింపఁ జేయజాలు పద్యములతోఁగూడఁ గేవల విషయపరిజ్ఞానమునే కల్పింపఁజాలిన వచనపాఠములను గూర్చుట యంత సమంజసముకాదని వారూహింపలేదు.

బిడ్డల సహజప్రవృత్తి — బిడ్డ తన యుత్సాహముప్పొంగినప్పుడు—భావ ముద్రేకించినప్పుడు—తనవచ్చియు

రానిమాటలకు వరుస (Rhythm) కల్పించుకొని యూఁచుచుఁ బాడుచుఁ దన యవ్యక్తహృదయభావము నవ్యక్తముగ వెలువరించుచుండును. అది పిల్లలసహజప్రకృతి. ఒక పిల్లలే కాదు. ఉత్సాహము పొంగి పొరలివచ్చినప్పుడు పక్షులుకూడ వరుసలుపెట్టి పాడుచుండును. దీనినిఁబట్టి చూడఁగా నుద్రిక్తభావము ప్రకటింపఁ బడవలసినప్పుడు గణబద్ధముగు శబ్దవిన్యాసము (Rhythm & Rhyme) కావలసియున్న ట్లగపడుచున్నది.

బిడ్డ—పాట:—గణబద్ధమగు పద సముదాయమున గాన మున్నది. అట్టిగానములో నానంద మున్నది. ఈయానంద మును ప్రేమమయముగు తల్లియొడిలో నుండినప్పటినుండియు బిడ్డ యనుభవించుచునే యుండును; తల్లి "జోజో" యని జోలపాటలు పాడినప్పు డాలకించుచు హాయిగ నిదురించుచుండును; "చందమామ రావె! జాబిల్లి రావె!" అని పాడుచుఁ దల్లి యన్నము పెట్టినప్పు డల్లన చేరుకుండ గోరు ముద్ద లారగించుచుండును. పిల్లల భావములు పాటలలో నుండియే—ఇట్టితల్లుల పాటలలోనుండియే పుట్టి పెరుఁగుచున్నవి. కాఁబట్టి, బిడ్డల యభినవోత్సాహవల్లికను (Fresh enthusiasm) గొనసాగింపవలయునన్నచో, బిడ్డల కోమల హృదయకోరకమును (Tender Mind) వికసింపఁ జేయవలయునన్నచో—బిడ్డల యవ్యక్తభావపరిమళమును (undeveloped thought) వెల్లివిరియఁ జేయవలయునన్నచో—

బిడ్డల సహజవిజ్ఞానమును (Natural intel ligence) సఫ
కృతముగఁ జేయవలయునన్నచో వారిహృదయాభ్యున్నతి కను
కూలములైన యనుభవోత్సాహముల (Experience &
encouragement) ననుసరించియే పద్యపాఠములు ర
యింప వలయును.

నివేదనము—మే మిట్టియుద్దేశమును మనసునందుం
కొనియే, తల్లికడుపునుండి బయటికివచ్చు బిడ్డలకుఁ దల్లిపాట
వలెనే, తమ పాటలవలెనే, మధురసులభంబులగు భావంబు
తోడను పదములతోడను, పద్యపాఠములను రచియిం
"బాలగీతావళి" యనునామముతో, 1, 2, 3 4, 5, తరగతు
లుగఁ బ్రకటించి యాంధ్రలోకమున కర్పించియున్నారము
దొరతనమువారును, విద్యాధికులును, మాయుద్యమము
మన్నించినందులకు మే మెంతయుఁ గృతజ్ఞులమగుచున్నాము

విద్యాశాఖాధికారు లీ మా ప్రయత్నమును సఫ
కృతముగఁ జేసి మాకుఁ బ్రోత్సాహముఁ గూర్పవలయునని
ప్రార్థించుచున్నాము.

విషయసూచిక.



పుట.

శ్రీరామచంద్ర.

# బాలగీతావళి.



## నాలుగవ తరగతి.

### మంచిబాలుఁడు.



గీ. ఉదయమున మేలుకాంచి నే నొక్కసారి
దేవదేవుని గూర్చి ప్రార్థించినాఁడ,
పడకపైనుండి లేచి నా పనులఁ దీర్చి
ముందుగా బడిలోనికిఁ బోయినాఁడ.

గీ. అందఱను మించి పాఠంబు లప్పగించి
అయ్యవారలచే మెప్పు లందినాఁడ;
కలసి తిరిగెడువారలుఁ గన్నవారు
పరమసంతోషమునఁ జూడఁ దగినాఁడ

గీ. పరుల ననకుండ ఒరులచేఁ బడకయుండఁ
గడుసుఖంబుగఁ గాలంబు గడపినాఁడ
అన్నదమ్ములతోఁ గూడి యాడినాఁడ
అమ్మ వడ్డింప భుజియించి యలరినాఁడ.

గీ. క్రొత్తపాఠంబు వల్లించు ǂ కొన్నవాఁడ
సిద్ధముగ నున్న పాన్పుపైఁ ǂ జేరినాఁడ
సుఖముగఁ బరుండవలెనని ǂ చూచినాఁడ
దేవదేవుని మఱల ప్రా ǂ ర్థించినాఁడ.

---

విద్య.

ఆ. తనకు నెదుటనున్న ǂ దానినిమాత్రమే
కన్నులున్న వాఁడు ǂ గాంచఁగలఁడు
విద్యయుండెనేని ǂ వివిధదేశంబులఁ
గలుగువానినెల్లఁ ǂ గాంచగలఁడు.

ఆ. విద్యయనెడుపెద్ద ǂ వెలుఁగులోఁ దిరుగఁడ
లేనివాఁడు కన్ను ǂ లేనివాఁడు
విశ్వమెల్లఁదెలుపు ǂ విద్య సంపాదింప
లేనివాఁడు జగతి ǂ లేనివాఁడు.

ఆ. తనగృహంబునందు ǂ ధనమెంతయుండిన
నొరుల కిచ్చుకొలఁదిఁ ǂ దఱిగిపోవు,
ఒరుల కిచ్చుకొలఁదిఁ ǂ బెఱుఁగుచుండునెగ
తనకుఁగలుగువిద్య ǂ తఱుగ దెపుడు.

---



## కన్ను.

గీ. ఎదుటఁ గనబడుచుండిన యెల్లవాని
కనుఁగొనఁగ నేర్చుకొన్న నా కన్నుదోయి
తన్నుఁ గనుఁగొనఁజాలక యున్నదకట!
యెవరిసంగతి వారల కెఱుకపడునె?



## విత్తనము.

గీ. పూలమొక్కలకును గడ్డి పోఁచలకును
ప్రాఁకుఁదీఁగలకును గూర పాఁదులకును
భూమిలో నెల్లచోటులఁ బుట్టిపెరుఁగు
వృక్షముల కెల్ల మూలంబు విత్తనంబె.

గీ. పదనుగా నేకున్న భూమిపైఁ బడినగింజ
తీఁగయగుటకొ చెమ్మగాఁ దేలుకొనుటకో
మొక్కగానుండుటకొ ముందు మొలకలెత్తి
క్రమముగాఁ దాను మట్టిలోఁ గలసిపోవు.

ఆ. ఒక్కలాగు మొక్క యొకలాగు చెట్టు, పూ
లొక్కలాగు, ఫలము లొక్కలాగు
మొవ్వ లొకలాగు, ముదరాకు లొకలాగు
ఇన్ని యన్నిరంగు లెంతవింత ?

---

నది.

గీ. కొండలను బుట్టి వనముల నుండివెడలి
ప్రక్కభూముల నన్నింటిఁ బండఁజేసి
నిమిషమైనను నొకచోట నిలువకుండ
నీమహానది వడివడి నేఁగుచుండె.



## సముద్రము.

పుట్టుచుండిన కెరటాలు ౹ పుట్టుచుండ
ఎగురుచుండిన కెరటంబు ౹ లెగురుచుండ
విఱుగుచుండిన కెరటాలు ౹ విఱుగుచుండ
ఊఁగిపోవుచున్నదీ ౹ సాగరంబు.

2\. ఎంతదవ్వుగలదో ౹ అంతుగానఁగరాదు
ఎంత సేపటికివి ౹ శ్రాంతిఁగనదు
ఎంతలోతుగలదో ౹ యెఱుఁగంగరాదిది
యెన్నినాళ్ళనుండి ౹ యిట్టులుండె?

3\. ఎన్నియేండ్లనుండి ౹ యెన్నొ తీయనినదు
లిందుఁజేరుచుండ ౹ నీసముద్ర
మెపుడుఁ బొంగుదు లేక ౹ యట్టులుండు నిదేమి ?
ఉప్పఁదనము వదల ౹ కుండెనేమి ?



గొడుగు.

గీ. తలకు సూర్యుని వేఁడిమి తగులకుండ
వానచినుకులు మేనిపై వ్రాలకుండ
ఎండవానల బాధ లే కుండఁజేసి
గొడుగు మన కెప్పుడును మేలుఁ గూర్చుగాఁదె.



నల్ల మబ్బు.

ఆ. ఎగిరిపోవుచున్న యేనుఁగులాగున
గునిసియాడు నల్ల గొండలాగు
ఆకసంబుమీఁద నాడుచు నున్నది
చల్లగాలితోడ నల్లమబ్బు.

గీ. "చేసినది యొప్పొ తప్పొ వ ౹ చింపవలయు
తప్పు దాఁపఁ జెప్పకు మన ౹ త్యంబు తల్లి
పలుకు దాఁచినఁ జేసిన ౹ పనులు దాఁగ
వమ్మ!" యని మందలించె న ౹ య్యసలజనని.

---



పా ద ర క్ష లు.

ఆ. ముల్లు నాటకుండ ౹ ముఱికి సోఁకకయుండ
కఱకురాళ్ళు తగిలి ౹ కందకుండ
కాలియుండు నేలఁ ౹ గాలు గాలకయుండ
పాదములకుఁ దొడుగు ౹ పాదరక్ష.

---

గీ. "చేసినది యొప్పొ తప్పొ వ ౹ చింపవలయు
తప్పు దాఁపఁ జెప్పకు మన ౹ త్యంబు తల్లి
పలుకు దాఁచినఁ జేసిన ౹ పనులు దాఁగ
వమ్మ!" యని మందలించె న ౹ య్యాసలజనని.

---



పా ద ర క్ష లు.

ఆ. ముల్లు నాటకుండ ౹ ముఱికి సోఁకకయుండ
కలుకురాళ్ళు తగిలి ౹ కందకుండ
కాలియుండు నేలఁ ౹ గాలు గాలకయుండ
పాదములకుఁ దోఁచు ౹ పాదరక్ష.

---



నా గ స ర ము.

గీ. గాలి బుగ్గలఁ బూరించి గతులు దెలిసి
తొలలపై వేళ్లు సులువుగా మలపుకొనుచు
పాగకుచ్చాఁగఁ బాముల వాఁడు వీఁడు
బాగుగా నూఁదుచున్నాఁడు నాగసరము.

ఆ. పనికిరాక పాఱ వైచిన దీకాయ
భరతపక్షిలాగు పాడుచుండె;
దరికిఁ జేరనంతఁ గఱచెడు నీపాము
పాడుచున్నపాట కాడుచుండె.

ఆ. చెవులుగలిగినట్టి జీవుల నగికట్టు
గానమందు నేమి గలదొ కాని
పనికిరానిదెల్ల బంగారమగుచుండు
గరళ మమృత మగుచుఁ గానంబునను.

## నవ్వు.

గీ. కొన్ని రూపములను జూచు । చున్నయపుడు
కొన్ని మాటల నాలించు । చున్నయపుడు
కొన్ని పనులను గావించు । చున్నయపుడు
ఇట్టి చిత్రంబుగా నవ్వు । పుట్టుచుండు.

---

## మంచి—చెడ్డ.

గీ. ఈశ్వరుఁడు చేసినట్టి యీ । సృష్టియందు
మంచిచెడ్డలు రెండు కా । న్పించుచుండు
ఒక్కనికి మంచిదై తోఁచు । చుండు దాని
నింకొకఁడు చెడ్డదానిగా । నెంచుచుండు.

గీ. పక్షులకు నిష్టమైయున్న । పట్టపగలు
పాప మా గుడ్లగూబకుఁ । బనికిరాదు,
చిన్నకోయిల తినుచుండు । చిగురుటాకు
చిలుకపిల్లకు మిక్కిలి । చెడ్డదగును.

గీ. నాకుఁ బ్రీతిగా నుండిన । నల్లకోటు
బుచ్చితమ్మున కగపడు । బూచిలాగు
నాఁకు బ్రీతిగా నుండిన । కోకిలంబు
నీ కసహ్యముగా నుండు కాకిలాగు.

గీ. ఇష్టము ననిష్టమునుబట్టి ✱ యేరుపడిన
మంచిచెడ్డలభేదంబు ✱ మనకెగాని
సృష్టిచేసిన దేవుని ✱ దృష్టిలోన
నట్టిభేదంబు దోపఁ దా ✱ వంతయైన.

---



చ త్వా ర ము.

బాలుఁడు:—

గీ. "నలువదేఁడులుఁగడచిన ✱ నాకుఁ గాని
ఇపుడు నీ కీ సులోచనా ✱ లేల బిడ్డ
అపుడె చత్వారమా ?" యని ✱ యందు వేమి ?
నాన్న ! కనుచీఁకటులనది ✱ నాకుఁ గలదు.

గీ. నాన్నకడ నున్నది సులోచ ✱ నాలజోడు
నాకుఁ జత్వారమున్నది ✱ చీఁకటులను
అది యిదియుఁ జెప్పి, మఱపించు ✱ నంతెకాని
నాన్న నాకది యియ్యకు ✱ న్నాఁడు తల్లి.

గీ. ఇష్టము ననిష్టమునుబట్టి | యేరుపడిన
మంచిచెడ్డలభేదంబు | మనకెగాని
సృష్టిచేసిన దేవుని | దృష్టిలోన
నట్టిభేదంబు దోపఁ దా | వంతయైన.

---



చత్వారము.

బాలుఁడు:—

గీ. "నలువదేఁడులుఁగడచిన | నాకుఁ గాని
ఇపుడు నీ కీ సులోచనా | లేల బిడ్డ
అపుడె చత్వారమా ?" యని | యందు వేమి ?
నాన్న ! కనుచీఁకటులనది | నాకుఁ గలదు.

గీ. నాన్నకడ నున్నది సులోచ | నాలజోడు
నాకుఁ జత్వారమున్నది | చీఁకటులను
అది యిదియుఁ జెప్పి, మఱపించు | నంతెకాని
నాన్న నాకది యియ్యకు | న్నాఁడు తల్లి.

తల్లి:—

గీ. చీఁకటిని గనఁబడకుండ చేతఁగాదు
పగటఁ జూపుతగ్గ నది చ త్వారమగును,
పిల్లికే కాని చీఁకటిఁ బిల్లలకును
పెద్దలకుఁగూడ గనులు కా న్పింపవయ్య!



గున్న మామిడి.

ఆ. చిగురులిచ్చుచుండెఁ జిన్నకోయిలలకు
ఫలములిచ్చుచుండెఁ జిలుకలకును
నీడలిచ్చుచుండు నీకును నాకును
తనకు మామిడేమి దాఁచుకొనియె!

గీ. కోకిల సుఖింపఁ దనకేమి కూడివచ్చె?
చిలుక తనివొందఁ దనకేమి కలిసివచ్చె?
ఇతరులు సుఖింపఁ దనయొడి యేమినిండె?
గున్నమామిడి యేమను కొనెనొ గాని.



## చందమామ.

గీ. అల్లుఁడుగా! కన్నుమలపి మీ రరయుఁ డిపుడు
మినుకు మినుకను చుక్కల మెఱయుచుండు
రమ్యమైయున్న నీలాంబ రంబునందు
చల్లఁగాఁ గూరుచున్నాఁడు చందమామ.

గీ. పొడుపు నెలనాఁ డొసంగిన పోఁగు తెల్ల
నెత్తికొని వెండిపూఁతఁ బూయించెనేమొ
చందమామకు నునువెండి జాల రుండె
నతు లరమోడ్చి కనుఁగొనుఁ డల్లుఁడవిగా!

గీ. సరిగఁ బదియేనుదినములు చందమామ
క్రమముగా సంజకే వచ్చుఁ గాని, వెనుక
నొకట నాలస్యముగ వచ్చు చుండి యుండి
మేము నిద్రించుదాఁక రాఁ డేమొ తుదకు.

గీ. ఆఁడుబిడ్డ లొప్పులకుప్ప | లాడువేళఁ
గల్లుగల్లను సద్దాల | గాజులందు
గిలిచి కన్నులు మిఱుమిట్లు | గొలుపుచుండు
చందమామకు నది యేమి | సంబరంబో.

గీ. ఆవుసందడిలోనున్న | యట్టివేళ
చెట్లకొమ్మల సందుల | చెంతఁజేరి
యారినచిగుళ్ళలో మంచు | నీరుపోసి
యెన్నియో ముత్తియములఁగా | యించుచుండు.

గీ. ఆటలో నోడిపోయిన | యట్టివారిఁ
దెల్లపోయినవారంచు | దెప్పబోవ
చిన్ని వెన్నెల నెల్లరఁ | జిన్నపుచ్చి
తెల్లబోయినవారలఁ | దెలియనీఁడు.

గీ. కొండపై నెన్ని చుక్కలో | నిండియుండ
దినమునకు నొక్కచుక్కతోఁ | దిరుగుఁగాని
"యూడుకొనరార ! జాబిల్లి | యనుచుఁబిల్ల
లెంత బిలిచిన దిగిరాఁడ | దేమి భయమొ ?

గీ. సరిగ తేఁజిగురాకుల | సందులందు
నెన్నియో వెండిపూలఁ బూ | యించుచుండుఁ
గనుమలపి చూడ మింటికిఁ | గంటికొకటి
వెండితీఁగ లెన్నెన్నొ క | ల్పించుచుండు.

గీ. ఒక్కమాటుగఁ దెరచాటు । నుండివచ్చు
భామ వేషంబువలె మబ్బు । ప్రక్కనుండి
చటుకుమని వచ్చుచుండు నీ । చందమామ
యీతనికి నింతమొయ్యార । మెందుకోఆకో?

గీ. నిండుగా నొక్కనాఁడు గా । న్పించినంత
నెవరిదృష్టులు తాఁకునో । యేమొ కాని
నాఁడు నాఁటికి కృశియించి । పాఁడిదప్పి
తిరిగి నెలనాళ్ళదాఁకను । తేరుకోనఁడు.

గీ. ఇంట నే నాడుకొనుచుండ । నిట్టెవచ్చి
ముంగిటిగవాక్షములనుండి । తొంగిచూచు;
తేరిచూచిన మిన్నెక్కి । కూరుచుండు;
దుందుడుకు బాలకుఁడుగాఁడె । చందమామ?

గీ. ఉగ్గుపాలను ద్రాగుచు । నున్న యపుడె
తల్లిచే విన్నదగుట జా । బిల్లిపదము
చందమామకు సరిపడు; । నెందు నొకటె
మామ జాబిల్లియనఁ జంద । మామ యనిన.



## నిద్ర.

ఆ. చదువుచున్నవేళ సంగీతమాలించు
చున్న వేళ బడలి యున్నవేళ
ఎచటినుండి యెప్పు డెట్టు లేతెంచునో
గాని, నిద్రవచ్చి కన్ను మూయు.

గీ. ఎప్పుడు వచ్చునో యీనిద్ర యెఱుఁగఁగాని
ఎప్పుడు మెలఁకువ వచ్చునో యెఱుఁగఁగాని
మేలుకాంచి పిమ్మటఁ "జాలసేపు
సుఖముగా నిద్రపట్టె" నం చును దలంతు.

ఆ. పగలు పనులుచేసి బడలిన జనులెల్ల
శ్రమలుదీర రాత్రి సమయమందు
హాయి నిదురవోవ నారోగ్యమగుఁగాని
పగటిపూట నిద్ర పనికిరాదు.

---

## భోజనము.

ఆ. సమయమునకు భోజ । నము సేయ సుఖ మిచ్చు
నధికబలము నిచ్చు । నాయు విచ్చు;
అరుగకుండ సరిగ । నాఁకలి కాకుండ
దినుట యెవరికైనఁ । దెవ్వులు తెచ్చు.

---

## చీఁకటి.

గీ. మిట్టపల్లంబు లేకమౌ । నట్లుచేసి
చెట్లు, చేమలు నేకమౌ । నట్లుచేసి
ఆకసము భూమి యేకమౌ । నట్లుచేసి
కటికిచీఁకటు లెల్లెడఁ । గ్రమ్మియుండె.

గీ. ఇంటిలోపల దీపంబు । లెన్నియున్న
దరికిరాకుండ నెంతగాఁ । దరుముచున్న
మూలమూలలఁబడి నాలి । ముచ్చులాగు
ఎట్టులున్నదో చీఁకటి । యింటిచుట్టు !

గీ. తలుపు తీయునంత । తలఁగిపోవుచునుండు
తలుపు మూయ నిలుచు । దానివెనుక,
దివ్వెఁ జూచినంత । దీని కెంతభయంబో
నాకు నంతభయము । చీఁకటనిన.

ఆ. దివ్వెగూడులకును ౯ దిగువ, మిద్దెలమీఁద,
స్తంభములకు వెనుక ౯ దాఁగి దాఁగి
ఇల్లు వదలదేమి ౯ యీ మొండిచీఁకటి
తన్ను వెలుఁగు లెంత ౯ తరుముచున్న ?



పిల్లి—ఎలుక.

గీ. కొట్టుగదిలోన దీపంబు ౯ కునుకుచుండె
అటుకపైఁ జేరి చూరెల్క ౯ లాడుచుండె,
అద్దగోడకు నొకప్రక్క ౯ నడఁగిముడఁగి
మెల్లగాఁ బొంచి కూర్చుండె ౯ నల్లపిల్లి.
ఆ. అద్దగోడమీఁది ౯ యావలిమూలను,
చుట్టుకుదురునందుఁ ౯ బెట్టియున్న
సున్నిపిండికుండఁ ౯ జూచి పేరాసతో
నుఱికె దానిమీఁది ౯ కొక్కయెలుక.

ఆ. వెనుకకాళ్ళ నడఁగి । తనదుమేను కదించి
యొడుపువేసి కూరు । చున్నపిల్లి
యెలుకఁ బట్టుకొనఁగ । నిట్టె యుఱాయించె
గోడమీఁదినుండి । కుండపైకి.

ఆ. పట్టుతప్పి పిల్లి । పడిపోయె, నాకుండ
గుండపిండి యగుచుఁ । గూలిపోయె
నుగ్గుపిండి పిల్లి । కన్నులఁ బడిపోయె
బ్రతుకు గాంచి యెలుక । పాఱిపోయె.



కొండ

ఆ. మేత మేసికొనుచు । మీఁదిమీఁదికిఁ బోయి
గొఱ్ఱెలెల్లఁ జిన్ని । కుక్కలట్లు
గోవులెల్ల లేడి । కూనలలాగున
బర్వతమునఁ గానఁ । బడుచుండె.

గీ. పర్వతమునఁ బైకి । బైకి జూచుకొలంది
ఎగురుపక్షులెల్ల । నీఁగ లట్లు

చెట్టులెల్లఁ జిన్ని । చిన్ని మొక్కలలాగు
దూరమందు నాకుఁ । దోఁచుచుండె.

ఆ. పసరుచెట్లతోడఁ । బచ్చని లతలతో
నిండియొప్పుచుండు । కొండమీఁద
నల్లనల్లవంగి । యాకాశ మావెక్క
నట్టె వ్రాలిపోయి । నట్టులుండె.

ఆ. కొండమీఁద దోఁచు । మాఁఘ నీహూర్యుఁడొ
క్కింత యెత్తుఁ యెయ్య । నంతెగాని
యతఁడు తోఁచుచుండె । నచ్చంబుగా నాకు
గోపురమునఁ బసిఁడి । కుండలాగు.

చిలుక.



గీ. వేఁడుకగు నాకు బొమ్మలు । వేయుటనిన
చిలుకబొమ్మను వ్రాయు నా । చేఁత నగును;
చక్కఁగాఁ బాడ్లతో నొక్క । జామికొమ్మ
వేసి యామీఁద నొకచిల్క । వేసినాఁడ.

గీ. ఆకురంగును ఱెక్కల కద్దినాఁడు
పొట్టపైఁ బూసితిని పచ్చ పట్టురంగు
నీలిరంగును మెడక్రింద నిలిపినాఁడు
ముక్కునకు నెఱ్ఱరంగును బూసినాఁడు.

గీ. చెట్లపై నప్పుడప్పుడు చేరియుండు
చిలుకలను జూచి యూహించి మెలపుతోడ
నెచట నేరంగు వలయునో యచట దాని
వేసి నాబొమ్మపూర్తి గావించినాఁడు.

గీ. చిలుక యచ్చంబుగా నుండెఁ జిలుకలాగు
మాటలాడుట యెగురుట మాత్రమింక
వ్రాయఁగాఁ జాలకుంటిని ; వానిఁగూడ
నేర్పువారున్నచో ముందు నేర్చుకొందు.

పాట.

గీ. పక్షులన్నియుఁ జెట్లపైఁ బాడుచుండె
పాడుచున్నాఁడు చల్లఁగాఁ బాటకాఁపు
పసులఁ గాచెడు బాలుఁడు పాడుచుండె
పాడుచున్నారు హాయిగాఁ బడవవాండ్రు.

గీ. గ్రుడ్డులోనుండి వెడలిన కూనమొదలు
పక్షులన్నియుఁ జక్కఁగాఁ బాడఁగలవు
తల్లియొడిబిడ్డ మొదలుగా, తాతదాఁక
ఆసపడుచుందు రాపాట లాలకింప.

గీ. పాట లానందమున బైటఁ బడుచునుండు
నట్టిపాలు కానంద మగుచునుండు
పాటయానందమును నాకుఁ బట్టువడిన,
పాడుకొనుచుందు; నానంద పడుచుందు.

---

## ఒ క మా ట.

గీ. నీవెపుడు జూచుచున్నవే నీకు నెదుటఁ
గానఁబడుచుండె నీపుస్తకంబునందు;
చదివికొని పెద్దవైనన్ను సరిగ నిట్లె
చూచినవి పొత్తమున వ్రాసి చూపఁగలవు.



## క ల.

గీ. మెల్లగాఁబోవు గాలిచే జలమునందు
నావపడవ మెల్ల మెల్లగా నడచుచుండె;
ఎపుడు నాతోడనుండు నా యిష్టసఖుఁడు
పక్కనే కూరుచుండె నా పడవమీఁద.

గీ. దూరముననున్న యొకకొండ । చేరనుండి
అందముగఁ గానఁబడుచుండెఁ । జాదమూను,
నన్ను బరిహాస మొనరింప । నాసఖుండు
వెన్నెలను నాకు గొడుగును । వేసి నవ్వె.

గీ. అంతలో మబ్బు తల్లెడ । నావరించె
తటుకుమని చూచుచుండఁ జీఁ । కటులు క్రమ్మె
వనములోపల బాముల । వాఁడు యెవఁడొ
నాగసర మూఁదుచున్నట్లు । నాకుఁ దోఁచె.

గీ. నేను గానంబు వినుచుండ । నిద్రవచ్చె;
అందఱును నిద్రఁ గనుచుండ । నల్లనల్ల
పడవ కదలికిఁ బోయె; నా । కదలి ఘోష
పడిగ వినవచ్చె; మెలకువ । వచ్చెనాకు.

ఆ. కనులు తెఱచి నేను । గాంచునప్పటికి నేఁ
బండియుంటి నాను । పడకమీఁద;
చాలఁ జదివియున్న । బాలగీతావళి
పడుచుండె గాన । వచ్చె నాకు ?